# ఆకస్మిక సమావేశము

శాల్లకూరి గోపాలరావు గారు

ఒకనాఁ డేకత మొక్క కాంత విజలీలోద్యానవాసంతల
క్ష్మికి విద్యాభ్యసనంబు సేయు గతి నాత్మీయాభిరామేంద్రియాం
గృకశృంగారవిచేష్టితంబు లొలయుం గైసేసి, స్వేచ్ఛావిహా
రకళాకౌశల మేపు చూపుచు నవార్యప్రీతి నున్నంతటన్, 1

మ. అవమానానిలభేదపూరణముచే నంభోధి నౌకాక్రియన్
పవమానప్లవమాననై యుభయపార్శ్వక్షేపణీయంత్రకృ
జ్జవమానోన్నతితో నరిత్రనియతాశామాత్రసంచారి యై
న విమానమ్ము నరోత్తమాంచితము మింటం దోఁచెఁ జోద్యంబుగన్. 2

తే. లింగభేదంబు గల తరుణాంగు లున్క - వని కవతరించె నపుడు పుష్పకవరంబు,
వివిధనైద్యుతశక్తులు వెలయు కతన - జలదమున కీడ్వఁబడు మేఘశకలమట్లు. 3

మ. సరసాన్యోన్యకటాక్షవీక్షలు హఠాత్సంప్రాప్తసామీప్యభా
స్వరలావణ్యపయఃప్రపూర్ణసుతనువ్యాజాంబుదాంతఃపర
స్పరతారుణ్యవిభిన్ననైద్యుతమహాశక్త్యాత్మతేజోలతల్
సరవిం దోఁచె స్వభూజయాస్త్రములు లోలత్వంబు స్వతంబుగన్. 4

క. హృదయకమలఘనభావము - పదు నటీ వీక్షాతటిత్ప్రభవకామాగ్నిన్,
తుది నీ రయ్యును నిలువక - కదలి బయలు ప్రాఁకె బాష్పనై తవ మెసఁగన్. 5

చ. అతులితరాగపూరతటిదాత్మకశక్తి యనుతుణాభివ
ర్ధిత మయి నిండి క్రిక్కిఱియ దేహము లోపమి నెంచి తద్బహి
ర్గతికయి మారయాంత్రికుఁడు గ్రక్కున నెత్తిన సూక్ష్మసూచికా
తతి యన రోమహర్షణము దార్కొనెఁ గంపపురస్సరంబుగన్. 6

* * * * * * *

# చిత్రపటముల వివరణము

సర్ దోరాబ్ తాతా:— సుప్రసిద్ధులగు జె. ఎన్. తాతాగారిపుత్రుడు. బొంబాయివర్తక ప్రపంచమునందు సగ్రగణ్య స్థానము నలంకరించుచున్నారు. సాక్చివద్ద ఉక్కు-కర్మాగారము లను, బొంబయికి విద్యుచ్ఛక్తిని లోనావ్లావద్దనుంచి పంపు సంకల్ప మును అనేకకోట్ల రూపాయలు వ్యయముచేసి పరిపూర్ణస్థితికి దీసి కొనివచ్చి తండ్రిగారి యభీష్టములను నెరవేర్చిరి.

---

సర్ ఫజుల్ భాయి కరీంభాయి:— సామ్రాజ్య శాస న సభాసభ్యుడు. బొంబయిలో బట్టలమిల్లుల కధిపతి. బొంబయి వణిగ్వరులలో సుప్రసిద్ధుడు. శాసనసభలో జేయు ప్రసంగములు భావ పూరితములై యుండును. యౌవన మహమ్మదీయ నాయకులలో నొకడు.

---

సంఘ సంస్కరణసభ—స్వచ్ఛంద నారీమ ణులు:— బొంబయిలోజరిగిన సంఘ సంస్కరణసభకు వాలంటి యరులుగా ఈ యౌవన స్త్రీలుండిరి. ఇట్టిసేవ బొంబయినగరములో తప్ప మరియెచ్చటను సాధ్యపడదు. నారీమణు లింతమంది ఈ విధ ముగా వాలంటియరులుగా సేవజేయుట కిదియే మొదటిపర్యాయము.

---

బొంబయి సేవాసంఘము:— సేవాసదనము పక్ష మున కొంతమంది బాలికలు, పడుచులు, కాంగ్రెసు జరగుచున్న దినములలో డబ్బాలు తీసికొని మంటపమంతయు తిరిగి 7000 రూ ప్యములను మూడుదినములలో వసూలుచేసిరి. ఇట్టి మహత్కార్య ములు బొంబయిస్త్రీలె చేయగలరు గాని నితరుల చేతగావు.

---

కుగ్లరుఆసుపత్రిగుంటూరు:— ఈ ఆసుపత్రి ఆంధ్ర దేశమంతటను ప్రసిద్ధికెక్కినది. వేలకొలది ఆంధ్రయువతులిచ్చట ఆరోగ్యము బడసి కుగ్లరుదొరసానికి కృతజ్ఞులయి యున్నారు. ఇది అమెరికన్ లూథరన్ మిషన్ వారిచే గుంటూరులో స్థాపింపబడినది. నాలిక సంవత్సరములకు పయిగా కుగ్లరుదొరసాని యిచ్చట సేవ జేయుచున్నది.

---

మదనపల్లి క్షయరోగవైద్యశాల:— చెన్నపురి నారతమువారి ధనసహాయముచేతను, మదరాసు రాజధానిలో బని చేయుచున్న క్రైస్తవ మతవ్యాపక సంఘములచేతను క్షయరోగ వ్యాధి చికిత్సకయి స్థాపింపబడినది. ఇచ్చట స్త్రీలకు పురుషులకు వేరుగా వైద్యశాలలు కలవు. క్షయరోగముచేత బాధపడువారు మదన పల్లికి వ్రాసినచో అచ్చటి నిర్వాహకులు జవాబొసంగగలరు.

---

శాంతినికేతనము, బోల్పూరు:— ఇది లోకమాన్యు లు రవీంద్రనాథ టాగోరుగారిచే స్థాపింపబడిన పాఠశాల. ఇందులో క్రైస్తవ మిషనరీలు సయిత ముపాధ్యాయులుగా నున్నారు. ఇచ్చట బాలురకు జెప్పబడు చదువు నవీనపద్ధతుల ననుసరించును. టాగోరు గారీశాలకయి నమితశ్రద్ధ బుచ్చుకొందురు.

---

సర్ దిన్షా పెటిట్ గారు:— కోటీశ్వరుడు, బట్టలమి ల్లుల కధిపతి. బొంబయిలో మహాగొప్ప పార్శీకుటుంబమునకు జెందిన వాడు. శాసనసభాసభ్యుడు. దేశాభిమాని.

---

వి. వి. జోగయ్యగారు బి. ఎ. బి. ఎల్:— గంజాంజిల్లా బరంపురములో న్యాయవాది. పబ్లికు ప్రాసిక్యూటరు, గవర్నమెంటు ప్లీడరు, రాజకీయవిషయములలో కాంగ్రెసు పుట్టినది మొదలు పరిశ్రమజేయుచున్నారు.

---

వి. రామలింగస్వామిపంతులు గారు:— బొబ్బిలి మహారాజా హైస్కూలుకు హెడ్డుమాస్టరుగారు. ఆప్రాంత్యమున విద్యాభివృద్ధికయి కృషిచేయుచున్న ప్రసిద్ధ ఆంధ్రపురుషులు.

---

డాక్టర్ కె. వి. సుబ్బారావుగారు:— అయిదు సం వత్సరములు కలకత్తాలో హోమపతీయను క్రొత్తవైద్యమును కష్ట పడి నేర్చుకొనివచ్చి మదరాసు నగరమందు వైద్యము చేయు చున్నారు. ఈయన నొక మాసికవైద్యపత్రికను సయితము స్థాపించి యున్నారు.

---

ఆంధ్రవిద్వాంసులు, శతావధానులు:— కూరు చున్నవారు:— (ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు) (1) ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు (2) పురాణపండ మల్లయ్యశాస్త్రి

గారు (3) వేదం వేంకటరాయశాస్త్రిగారు (4) చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు (5) దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు. నిలబడి యున్నవారు (1) నంబూరి తిరునారాయణస్వామిగారు (2) వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (3) శ్రీరాజా భుజంగరావుగారు

---

లెఫ్టినెంటు …. వెంకటరత్నంనాయుడుగారు:— లెఫ్టినెంటు హెచ్. సుందరరాజన్, లెఫ్టినెంటు వేణుగోపాల్. వీరికి ఐ. ఎం. ఎస్. లో కమీషనులు దొరికినవి. సైన్యములో వైద్యులుగా నియమింపబడి ఇండియాకు పంపబడిరి. ఆంధ్రులు.

---

జాడ్వారుమహారాజు:— వీరు యుద్ధభూమికి వెళ్లి జోధపుర రాజవంశపు కీర్తినినిలిపెరి. లోకప్రఖ్యాతులగు మహారాజా సర్ ప్రతాపసింగుగారీయన పినతండ్రి. ఈయన బాల్యదశలో జాడ్వారుకు సింగుగారు రాజప్రతినిధిగా బనిచేసెను రెండు నెలల క్రిందట హార్డింజప్రభువుచే పట్టాభిషిక్తుడొనరింపబడెను. యుద్ధభూమికివెళ్లి స్వదేశసంస్థానాధీశులకు కీర్తితెచ్చిన యౌవన మహారాజులలో నొకరు.

---

డాॅ. వెంకటాచలపతిశర్మ:— డాక్టరు కూని తొట్టె వైద్యము నాంధ్రదేశములో ప్రవేశపెట్టిన పుణ్యాత్ములలో నొకరు. కూనిగారి పుస్తకముల నాంధ్రీకరించి ఆంధ్రదేశమందీ వైద్యప్రచారమునకు తోడ్పడిరి.

---

కె. మా. శర్మగారు:— స్వధర్మప్రకాశినీ సంపాదకులు. గ్రంథకర్త.

---

శివశంకరుడు:— ఈయన చిన్నతనమందే మంచికవనమును జెప్పుచున్న యౌవనాంధ్రుడు.

---

గద్దె వెంకటకృష్ణయ్య:— 1½ మైలు ఈతపందెమునందు బందరు వ్యాయామపరీక్షలలో జయమొందెను.

---

జనరలు బర్డువుడ్:— డార్డినల్సులో దిగిన ఆస్ట్రేలియను సేనల కధిపతి. ఇండియాలో చాలకాలము కొలువు చేసెను.

---

జనరలు సర్ జేమ్సువిల్కాక్సు:— హైందవసేనకు ఫ్రాంసు, ప్లాండరులలో నాయకుడుగానుండి వారి కనేక జయములను సమకూర్చెను. ఈ యుద్ధములో గొప్పకీర్తినిపొందిన ఆం
సేనాధిపతులలో నొకరు.

---

కిచ్నెరు ప్రభువు:— యుద్ధములో బోరుటకయి ఆ సే
లక్షలవంటి స్వచ్ఛంద సైనికులనుజేర్చెను. ఈయుద్ధపు గడబిడలు ల
చో హిందూదేశ రాజప్రతినిధిగా రాదలసినట్టివాడట.

---

జనరలు సర్ లెస్లీరండల్:— యుద్ధములలో బ
గుగా ఆంగ్లసేనలను నడుపుచున్న సైన్యాధిపతులలో నొక

---

సర్ జాన్ సైమన్:— ఆంగ్లమంత్రులలో నొక
న్యాయవాది. లిబరలుకక్షివాడు. నిర్బంధసైనిక సేవ వలదని పోరా
యుద్యోగమునకు రాజీనామా నొసంగెను.

---

ఎఫ్. ఇ. స్మిత్:— ఇంగ్లండులో యూనియని
నాయకులలోని యౌవనులలో గట్టివాడు. న్యాయవాదిత్వమువల
లక్షలార్జించును. ప్రెస్ సెన్సారుగా కొంతకాలముండెను. తరువా
కప్టెనుగా యుద్ధభూమి కరుదెంచెను.

---

కేరుహార్డీగారు.— ఇంగ్లాండులో కృషీవలుల నా
కుడు. యుద్ధమువలదనినవాడు. పార్లమెంటు మెంబరు. ఇండియ
యందపరిమిత సానుభూతికలవాడు. ఇండియాకువచ్చి చూచి స్థి
గతులనుగూర్చి పుస్తకము వ్రాసెను.

---

సి. ఎల్. వాషిన్ లీ:— ఆకాశ విమానదళాధిప
లలో నొక్కరు. దేశమును శత్రువిమానదాడినుండి కాపాడు భా
మీయనమీద చాలకలదు.

---

సిపాయి మీరాదుబక్సు:— ఈయన చరిత్ర మాంధ్రప
కలో వ్రాయబడెను. అతి సాహసపరాక్రమమునకయి విక్టోరియ
పతకమును జార్జి చక్రవర్తిగా రిచ్చిరి.

---

కె॥ లక్ష్మీనారాయణగారు:— గుంటూరుజిల్లా వే
పాలెములో సెకండరీస్కూలును స్థాపించి అభివృద్ధిలోనికి దెచ్చి
యూనియను పంచాయితీలో శ్రద్ధవహించి పనులను జేయుచుందు
సహకారసంఘములను, ముష్టిఫండును వేటపాలెములో స్థాపిం
రాత్రిపగటి పాఠశాలలు కృషీవలులకు పెట్టవలయునని యత్నిం
చున్నారు.